శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



**జగదాచార్య సింహాసనాధిపతి, కాఞ్చీ మహావిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ ప్ర.భ.అణ్ణఙ్గరాచార్యస్వామి విరచిత**

# ప్రపన్నగాయత్రీవర్ణానుక్రమస్తుతి




**అనువాదకులు:**

'పండిత రత్న' డా॥ ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అప్పగ శింగరాచార్యులు



**సంపాదకుడు:** ఈయుణ్ణి అనంత రంగ రామన్

**02-01-2022**

**కాంచీనగరీభూషా భూమ్యా ఇతి ఖలు పురాణోక్తిః |**

**కాంచీనగరీభూషా విలసతి హస్త్యద్రినాథగురువర్యః ||**



జగదాచార్య సింహాసనాధిపతి, కాఞ్చీ మహావిద్వాన్,

**ఉ.వే.శ్రీమాన్ ప్ర.భ.అణ్ణఙ్గరాచార్యస్వామి వారు**

# విజ్ఞప్తి

పూర్వాచార్య పరంపరా రత్నాలహారంలో నాయకమణిగా ప్రకాశిస్తున్న భగవద్రామానుజుల వైభవం అసామాన్యమైనది. దీనిని, వారికంటే ముందు అవతరించిన నమ్మాళ్వార్లు, పేయాళ్వార్లు, గోదాదేవి మొదలైన దివ్యసూరులు, వారి సమకాలీనులైన తిరువరఙ్గత్తముదనార్, అనంతార్యులు, ముదలియాణ్డాన్, వడుగనమ్బి, గరుడవాహన పండితులు, ఎమ్బార్ మొదలైన సమకాలీనులు, వేదాంత దేశికులు, వరవరమునులు, అణ్ణవప్పఙ్గార్, వడివళగియ నమ్బి దాసర్ మొదలైన అనంతరకాలానికి చెందినవారు శ్రీరామానుజ వైభవాన్ని స్తుతించే గ్రంథాలను రచించారు.

యాదవాచల మాహాత్మ్యంలోని 'కలౌ కశ్చిత్ భవిష్యతి' అనే సూక్తి మొదలైన పౌరాణిక ప్రయోగాలు, అవతరించబోయే రామానుజుల వైభవాన్ని తెలుపుతున్నాయని అభిజ్ఞులైన ఆచార్యుల అభిప్రాయం. నమ్మాళ్వార్లు 'కలియుమ్ కెడుమ్' ఇత్యాదిగా తిరువాయ్ మొళిలో, పేయాళ్వార్లు 'పెరుగుమత వేళమ్' అనే మూన్ఱాన్దిరువన్దాది పాశురంలో, తిరుప్పావై ప్రబంధంలో గోదాదేవి – రామానుజ వైభవాన్ని వ్యక్తం చేశారని పూర్వాచార్యుల అభిప్రాయం.

తిరువరఙ్గత్తముదనార్ ప్రపన్న గాయత్రి అని పేరుపొందిన 'ఇరామానుశనూఱ్ఱన్దాది'ని, అనంతార్యులు 'రామానుజ చతుఃశ్లోకి'ని, వడుగనమ్బి 'యతిరాజ వైభవా'న్ని, ముదలియాణ్డాన్ 'ధాటీపఞ్చకా'న్ని, ఎమ్బార్ భగవద్రామానుజుల దివ్యమంగళ విగ్రహ వర్ణనను చేసే ముక్తక పాశురాన్ని, గరుడవాహన పణ్డితులు 'దివ్యసూరిచరితం'లో రామానుజచరిత్రను వర్ణించే సర్గలను రచించి రామానుజవైభవాన్ని ప్రకాశింపజేసిన విషయం సుప్రసిద్ధం.

తరువాతికాలానికి చెందిన వేదాంత దేశికుల 'యతిరాజ సప్తతి', శ్రీవరవరమునుల 'యతిరాజ వింశతి', వడివఴగియ నమ్బి దాసర్ రచించిన 'రామానుజ వైభవం', పిళ్ళైప్పెరుమాళ్ అయ్యఙ్గార్ రచించిన 'యతిరాశరన్దాది', అణ్ణావప్పఙ్గార్ ల 'రామానుజ అతిమానుషస్తవం', పిళ్ళైలోకం జీయర్ ల 'రామానుజార్య దివ్య చరితై', పిన్బఴగరామ్ పెరుమాళ్ జీయర్ ల 'గురుపరంపరా ప్రభావం' – ఇవన్నీ కూడా రామనుజ వైభవాన్ని, చరిత్రను తెలిపే కృతులు. ఇవేకాక సంస్కృతంలో, ద్రావిడంలో, ఆంధ్రభాషలో ఇంకా అనేక భారతీయ భాషలలో రామానుజ వైభవాన్ని తెలిపే గ్రంథాలు అనేక ప్రక్రియలలో ఆయా కాలాలలో రచింపబడ్డాయి. ఈనాటికీ రచింపబడుతున్నాయి. ఎంతమంది ఎన్ని గ్రంథాలు రచించినా రామానుజ వైభవాన్ని పూర్తిగా వర్ణించడం సాధ్యం కాదు.

గత శతాబ్దిలో సుమారు 80 సంవత్సరాలపాటు శ్రీరామానుజ సిద్ధాంతాన్ని, సంప్రదాయాన్ని తమ అమూల్యమైన రచనలతో, ప్రవచనాలతో ప్రచారం చేసిన మహనీయులు, **కాఞ్చీపుర వాస్తవ్యులు, జగదాచార్య సింహాసనాధిపతి, పద్మవిభూషణ ఉ.వే.శ్రీమాన్ ప్రతివాది భయంకరం అణ్ణఙ్గరాచార్యస్వామి వారు**. వీరు భగవద్రామా–నుజులను స్తుతిస్తూ 'ప్రపన్నగాయత్రీవర్ణానుక్రమస్తుతి' అనే స్తోత్రాన్ని ఒక విలక్షణమైన పద్ధతిలో రచించారు. ఈ స్తోత్రంలో ఉండే శ్లోకాలలో మొదట ప్రయోగింపబడిన వర్ణాలు ప్రపన్నగాయత్రిగా పేరు పొందిన 'ఇరామానుశనూఱ్ఱన్దాది' ప్రబంధంలోని పాశురాల ప్రారంభంలో మొదట ఉండే వర్ణాలతో సమానంగా ఉంటాయి. ఇటువంటి అక్షర వైచిత్రితో ఈ స్తుతి ప్రకాశిస్తున్నది. ప్రసంగవశాత్తూ ఇందులో ఎన్నో సంప్రదాయార్థాలు చోటు చేసికొన్నాయి. ఈ కృతి అణ్ణఙ్గరాచార్యస్వామి వారి కవితారచనలోని పాటవాన్ని తెలుపుతూ సహృదయ పాఠకులను రంజింపజేస్తున్నది.

ఈస్తోత్రం ఇంతవరకూ తెలుగు భాషలో ముద్రింపబడినట్లు కనిపించలేదు. ఇప్పుడు తెలుగు తాత్పర్యంతో ప్రకటింపబడుతున్నది. ఈ గ్రంథం భగవద్రామానుజ సహస్రాబ్ది మహోత్సవాలు లోకసమ్మోహనంగా జరుపబడుతున్న ఈ సందర్భంలో ప్రకాశింపజేయడం సముచితమని తలచి ఈ ప్రయత్నం చేయబడుతున్నది. సహృదయులైన ప్రపన్న పాఠకులు దీనిని ఆదరించి ఆనందిస్తారని తలుస్తాను. దీనిని అనువదించి ప్రకటించడానికి అంగీకరించిన శ్రీమాన్ అణ్ణజ్గరాచార్య స్వామివారి పౌత్రులు **ఉ.వే.శ్రీమాన్ రాజహంసం స్వామివారికి, వారి సోదరులకు** అనేక ధన్యవాదాలు. దీనిని సిద్ధం చేయడంలో సహకరించిన కుమారుడు చి.అనంత రంగ రామన్ కు అనేక మంగళాశాసనాలు. స్వస్తి.

**స్తుతిః ప్రపన్నగాయత్రీవర్ణానుక్రమతః కృతా,**
**అణ్ణజ్గరార్య గురుభిః మోదం జనయతాత్ సతామ్.**

భవదీయుడు,
**ఈ.ఏ.శింగరాచార్యులు**

# ప్రపన్నగాయత్రీవర్ణానుక్రమస్తుతి

**1. (పూమన్ను)**

**పూతా వయమిహ సతతం భగవద్రామానుజార్య మననేన,**

**గంగాయమునాదిసరిన్నిషేవణే నైవ జాయతే కుతుకమ్.**

భగవద్రామానుజులను నిత్యం చింతించినందున పవిత్రతను పొందినవారం అయ్యాము. ఇక గంగ మొదలైన తీర్థాలలో స్నానమాడడంలో ఆసక్తిని కలవారం కాము.

**౨. (కళ్ళార్)**

**కలిజిన్మునిపదసక్తః కమనీయశిఖానివేశనః కాంతః,**

**కాషాయాంబరధారీ యతిపతిరాస్తే సదైవ మమ మనసి.**

తిరుమంగై ఆళ్వార్ల శ్రీచరణాలలో భక్తిని కలవారు, అందమైన శిఖాసన్నివేశాన్ని కలవారు, మనోహరమైన రూపాన్ని కలవారు, కాషాయవస్త్రాన్ని ధరించినవారైన భగవద్రామానుజులు సదా నా మనసులో వేంచేసి ఉన్నారు.

**౩. (పేరియల్)**

**పేటీ భగవద్గుణగణభూషణబృందస్య లక్ష్మణాచార్యః,**

**సంసారసాగరాన్నః సత్వరముద్ధర్తుమాగతః పృథివీమ్.**

భగవానునికల్యాణగుణాలనే భూషణాలను భద్రపరచే పెట్టెవంటివారైన భగవద్రామానుజులు మనలను జన్మసముద్రం నుండి త్వరగా ఉద్ధరించడం కోసం ఈ లోకంలో అవతరించారు.

**4.(ఎన్నైప్పు వియిల్)**

**ఏనఃపుంజసమావృత మస్మాదృశజన మపారయా కృపయా,**

**పావనహృదయాన్ కర్తుం ప్రాదుర్భూతో యతీశ్వరో భువనే.**

పాపసమూహాలను నిండుగా కల నావంటివారిని పరిశుద్ధులనుగా చేయడంకోసం భగవద్రామానుజులు ఈ లోకంలో అవతరించారు.

**5.(ఎనక్కు*ర్ర* శెల్వమ్)**

**ఏష గురుర్యతిరాజః శఠజిత్కలిజిన్ముఖైః గురూత్తంసైః,**

**సందర్శితాం సమీచీం సరణిం త్రాతుం సమాయయౌ భువనమ్.**

నమ్మా**ళ్వా**ర్లు, తిరుమంగై ఆ**ళ్వా**ర్లు మొదలైన పూర్వులు చూపిన సన్మార్గాన్ని రక్షించడంకోసం ఈ భూమిలో శ్రీరామానుజులు అవతరించారు.

**6.(ఇయలుమ్ పొరుళుమ్)**

**ఇహ జగతి బహవ ఏవ హి చతురాః ప్రాదుర్బభూవు రాచార్యాః,**

**భగవద్రామానుజమునిరేకో హి గురుః ప్రశస్యతే ప్రాజ్ఞైః.**

గొప్ప ఆచార్యులు పలువురు ఈ లోకంలో అవతరించినా, భగవద్రామానుజులొకరే ఆచార్యులుగా విజ్ఞులచే లెక్కింపబడుతున్నారు.

**7.(మొ*ళి*యై)**

**మోక్షప్రదో ముకుందః కథితః శాస్త్రేషు దిశతి స హి కృచ్ఛ్రాత్,**

**భగవాన్ యతిపతిరేష తు కేవల మాత్మీయకరుణయా దత్తే.**

ముక్తిని ఇచ్చేవాడు ముకుందుడేనని అంటారు. అయితే, అతడు మనలను శ్రమపెట్టి ముక్తిని ఇస్తాడు. భగవద్రామానుజులైతే, కేవలం తమ కరుణతోనే ముక్తిని ప్రసాదిస్తారు.

**8.(వరుత్తుమ్)**

**వదత యతీంద్రోక్తితతీః నమత తదీయం పదాంబుజద్వంద్వమ్,**
**దిశత తదీయవచస్తతిదివ్యార్థాన్ సాధుశిష్యబృందేభ్యః.**

భగవద్రామానుజుల శ్రీసూక్తులను నోరార పలకండి. వారి శ్రీచరణపద్మాలను నమస్కరించండి. సాత్త్వికులైన శిష్యులకు వారి సూక్తులలోని దివ్యార్థాలను ఉపదేశించండి.

**9.(ఇఱైవనై)**

**ఇంధే యతిపతిరనిశం సర్వేష్వపి దివ్యదేశవర్గేషు,**
**శఠరిపుసహస్రగీతిప్రబంధపారాయణస్థలేష్వపి చ.**

భగవద్రామానుజులు ఎక్కడెక్కడ వేంచసి ఉంటారు? అంటే, కోయిల్ (శ్రీరంగం), తిరుమల, పెరుమాళ్ కోయిల్ (కంచి), తిరునారాయణపురం మొదలైన సకలదివ్యదేశాలలో, తిరువాయ్ మొழி దివ్యప్రబంధాన్ని పారాయణ చేసే చోట్లలో వేంచేసి ఉంటారు.

**10.(మన్నియ)**

**మంత్రార్థసారబోధన సంజీవితసాధుశిష్యసముదాయమ్,**
**గోష్ఠీపూర్ణగురూత్తమపదప్రవణం యతీశ్వరం వందే.**

సారమైన మంత్రార్థాన్ని ఉపదేశించి, శిష్యులను తరింపజేసేవారు, తిరుక్కోట్టియూర్ నంబివిషయంలో భక్తిని కలవారు అయిన శ్రీరామానుజులను నమస్కరిస్తున్నాను.

**11.(శీరియ)**

**శ్రీమాన్ యతిపతిసూర్యో యది భువనేస్మిన్ కృతోదయో న స్యాత్,**
**కలికోలాహలవిభవో వచసాం వైదేశికో సత్యం స్యాత్.**

భగవద్రామానుజులు ఈ లోకంలో అవతరించకపోయి ఉంటే కలిపురుషుడు చేసే కోలాహలం మాటలతో చెప్పడానికి సాధ్యం కాకుండా ఉండేది.

**12.(ఇడజ్కొణ్డ)**

**ఇదమేక మభిదధేహం సూనృతవచనం నిశమ్యతామఖిలైః,**

**ఉపదిశతేతి యతీంద్రో న వదేద్యది మూక ఏవ లోక స్స్యాత్.**

వాస్తవమైన ఒక విషయాన్ని పలకుతాను. అందరు వినండి. **"పారులకిల్ ఆశైయుడైయోర్ క్కెల్లామ్ ఆరియర్కాళ్ కూఱుమిన్"** – ఓ ఆచార్యులారా! ఈ జగత్తులో వినాలనే ఆశను కలవారికి అందరికి మీరు అర్థాలను ఉపదేశించండి" అని భగవద్రామానుజులు చెప్పకపోతే లోకమంతా నోరు తెరవలేని మూగవానివంటిది అయి ఉండేది.

**13.(శెయ్యుమ్ పశుమ్)**

**శిష్యై రపరిమితై స్స్వైః సాకం విరచయ్య సర్వతో యాత్రామ్,**

**సర్వా అపీహ జనతాః నిన్యే యతిరాట్ పవిత్రతామాశు.**

భగవద్రామానుజులు లెక్కలేనంత మంది తమ శిష్యసమూహాలతో కలసి ఎనిమిది దిక్కులలో క్షేత్రతీర్థయాత్రలను చేసి, అందరిని పవిత్రులను చేశారు.

**14.(కతిక్కు)**

**గతిరహిత మఖిలభువనం త్రాతుం స్వీయోపదేశసహస్రైః,**

**ఆద్యో భోగీ కృపయా భగవద్రామానుజార్యరూపోభూత్.**

ఏ గతిలేని లోకంలోని వారిని అందరిని తమ వేలాది సంఖ్యలోని ఉపదేశాలతో రక్షించడంకోసం ఆదిశేషులే భగవద్రామానుజులుగా అవతరించారు.

**15.(ஶோராத)**

**శోధయితు మస్మదాదీన్ స్వకీయదివ్యోపదేశజాహ్నవ్యా,**

**యతిపతిరజహాత్ సత్యం పంచాయుధరూపమితి వదంత్యార్యాః.**

భగవద్రామానుజులు మనవంటివారిని తమ ఉపదేశాలనే గంగాజలాలతో పరిశుద్ధులుగా చేయడంకోసం పంచాయుధరూపాన్ని విడచిపెట్టి ఈవిధంగా అవతరించారని పెద్దలంటారు. ("**అడైయార్కమలత్తు**" అనే పాశురంలో ఈ భావాన్ని తిరువరంగత్తముదనార్ ఇరామానుశ నూత్తందాది ప్రబంధంలో అనుసంధించడాన్ని గమనించవచ్చు)

**16.(தாழ்வொன்றில்லா)**

**తాత్పర్యసారవేదీ సర్వేషాం చైవ శాస్త్రబృందానామ్,**

**శ్రీమాన్ యతిపతిరేకో నాన్యః కోపీతి సశపథం వచ్మి.**

సకలశాస్త్రాలలోని యథార్థతత్త్వాన్ని తెలిసినవారు భగవద్రామానుజులు తప్ప ఇంకొకరు లేరు—అని ప్రమాణపూర్వకంగా పలుకుతాను.

**17.(முனியார்)**

**మునివరకృతితతికథితా నఖిలానర్థాన్ విమృశ్య సంశోధ్య,**

**పరమకృపాలు ర్యతిరాట్ స్వీయగ్రంథేషు తాన్ న్యవీవిశత.**

వ్యాసపరాశరాది మహర్షులు రచించిన సకలగ్రంథాలలో చెప్పబడిన సకలార్థాలను మిక్కిలి దయ కల భగవద్రామానుజులు విచారించి, పరీక్షించి, వాటిని తమ దివ్యగ్రంథాలలో పొందుపరచారు.

**18.(ஏய் தக்கரிய)**

**ఏతద్విమృశత నిభృతం శ్రీభాష్యమితి ప్రథా యతీంద్రకృతేః,**

**భాష్యే కేవలమభవత్ తదిదం వైభవ మనన్యసామాన్యమ్.**

బాదరాయణుల బ్రహ్మసూత్రాలకు పలు వ్యాఖ్యానాలున్నా, శ్రీభాష్యమనే పేరు భగవద్రామానుజ భాష్యానికే కలిగింది. ఈ గొప్పతనం శ్రీరామానుజుల భాష్యానికి అసాధారణమైనది.

**19.(ఉఋ పెరుమ్)**

**ఉచ్చా అమీ ఇమే ఖలు నీచా ఇతి తారతమ్య మనవేక్ష్య,**
**సర్వత్ర భక్తవర్గే సమరూపకృపాం హి యతిపతిశ్చక్రే.**

వీరు ఉన్నతులు, వీరు అధములు — అనే భేదం లేకుండా మహానందప్రవాహంలో కూడా భక్తులందరిపట్ల సమానమైన దయను భగవద్రామానుజులు చూపారు.

**౨౦) (ఆరప్పొ ప్రిల్)**

**ఆనంద మధిక మాప్తుం సర్వేపి జనాః స్పృహాం పరాం దధతే,**
**యది సత్యమేతదవనౌ యతిపతిగీర్భిర్హి సులభ ఆనందః.**

మహానందప్రవాహంలో మునిగిపోవడమనేదే లోకంలో ఉండేవారికి అందరికి ఆశ అయితే, ఆ ఆనందం భగవద్రామానుజుల సూక్తులలోనే లభిస్తుంది.

**21.(నిధియై)**

**నిధిమిహ దదతి వదాన్యా ఇతి కతిపయనీచనృపగృహద్వారి,**
**నాహ ముపవిశ్య యాచే యతిపతికృపయా సమృద్ధ ఏవాస్మి.**

వీరు నిధిని వర్షించడలో సముద్రం వంటివారు—అని పలికి నీచులైన కొందరి గృహాల ముంగిళ్ళలో నిలచి యాచించను. యతిరాజుల కృపవల్ల నేను సమృద్ధిని కలిగి ఉన్నాను.

**22.(కార్తికైయానుమ్)**

**కారణలవలేశమృతే యతిపతివర్యో మయి ప్రకాశితవాన్,**

**దాసే పరమకృపాం స్వాం తత ఏవాహం తనోమి కృతిమేనామ్.**

భగవద్రామానుజులు ఏ కారణం కొంచెంకూడా లేకపోయినా దాసునిపై గొప్ప కృపను చూపించారు. అందువల్లనే నేను వారిని ఈ విధంగా స్తుతిస్తున్నాను.

**౨౩.(ఫ్రైప్పా య)**

**వైయాకులీ న మే స్యాత్ క్వ చిదప్యర్థే దృఢం త్విదం వచ్మి,**

**వరవరమునీంద్రరూపీ యతిపతిరద్భుతకృపాం యత శ్చక్రే.**

భగవద్రామానుజులు శ్రీవరవరమునులై అవతరించి, దాసునిపై అద్భుతమైన దయను చూపించినందున నాకు ఏ విషయంలోను చింత అనేది లేదని దృఢంగా చెప్పగలను.

**౨౪.(మొయ్ త్త)**

**మోఘీభావమగాన్మే నైకోపి మనోరథో యతీశ్వర! భోః,**

**కాంక్షిత మఖిలం సిద్ధ్యతి వినా విలంబం త్వదీయయా కృపయా.**

భగవద్రామానుజా! దాసుడు కోరుకొనేది ఏదీ వ్యర్థం కాలేదు. ఈ విధంగా నా కోరికలన్నీ సిద్ధించడానికి తమ దయయే కారణం.

**౨౫.(కారేయ్)**

**కారణభూతం జగతా మఖిలానా మచ్యుతం హి కథయంతి,**

**ఈదృశకృతితతికరణే కారణమేకా యతీశ్వరస్య కృపా.**

లోకంలో అన్నిటికి కారణం భగవానుడే – అని అంటారు. కాని, నేనీ విధంగా స్తుతిని రచించడానికి భగవద్రామానుజుల కృపయే కారణం.

**౨౬.(తిక్కు]ற்ற)**

**దిక్షు విదిక్షు చ సతతం సర్వే ఘుష్యంతి వర్ధతా మాజ్ఞా,**

**దివ్యా యతీశ్వరస్యైతావద్వైభవం న కస్యాపి.**

"రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్" అని అన్ని దిక్కులలో ఘోషింపబడుతున్నదికదా! ఇటువంటి మహిమ ఇంకొకరికి ఎవరికీ లేదు.

**౨౭.(కొళ్ళ)**

**కో వా మయా సమానో విలసతి యతిరాజ! దృప్త ఏవాస్మి,**

**యస్మాదీదృశనుతితతి మారచయన్నహమిహ ప్రహృష్యామి.**

భగవద్రామానుజా! "నాతో సమానమైనవారు ఎవరున్నారు?" అని నేను సాత్త్వికాహంకారంతో ఉన్నాను. ఇటువంటి స్తుతులను రచిస్తూ ఆనందిస్తాను.

**౨౮.(నెఞ్జిల్)**

**నేహాస్తి కిమపి నానేత్యవేక్ష్య వాచం విముగ్ధహృదయానామ్,**

**భ్రాంతిమపోహ్య యతీంద్రో నిగమాంతార్థం యథార్థమాతేనే.**

"నేహ నానాస్తి కించన" అనే శ్రుతివాక్యంలోని అర్థాన్ని తెలియలేకుండా మనస్సులో భ్రాంతిని పొందినవారి భ్రమను తీర్చే భగవద్రామానుజులు ఆ శ్రుతిలోని యథార్థతత్త్వాన్ని లోకంలో విస్తరింపజేశారు.

**౨౯.(కూట్టుమ్)**

**కూలే జలధేరథ చ స్యందనకోణే చ రామకృష్ణాభ్యామ్,**

**కథితౌ శ్లోకౌ రంగీ సంస్మార్య త్వాం యతీంద్ర! హర్షమదాత్.**

భగవద్రామానుజా! విభీషణుని ఉద్దేశించి సముద్రతీరంలో, అర్జునుని ఉద్దేశించి రథంతొట్టిలోను శ్రీరామ, శ్రీకృష్ణావతారాలలో తాను పలికిన రెండు చరమశ్లోకాలను మీకు శ్రీరంగనాథుడు గుర్తు చేసి, మిమ్ములను ఆనందింపజేశాడు.

**౩౦.(ఇన్బమ్ తరు)**

**ఇచ్ఛథ యదీహ లోకే నిత్యానందానుభూతి మధిగంతుమ్,**

**భగవద్భాష్యకృదుక్తీ స్సతతం సేవధ్వ మాదరాతిశయాత్.**

లోకులారా! మీరీలోకంలో స్థిరమైన అనందాన్ని అనుభవించాలని అనుకొంటే భగవద్రామానుజుల దివ్యసూక్తులను ఆదరంగా సేవించండి.

**31.(ఆణ్డుగళ్)**

**ఆశామపథేష్వధికాం బిభ్రతి హా హంత! మూర్ఖజననివహాః,**

**ఆశా భగవద్యతిపతిపాదాబ్జభక్తౌ భవేద్యది క్షేమమ్.**

అయ్యో! మూర్ఖులైన జనులు చెడ్డ మార్గంలో ఆశను కలవారై చెడిపోతున్నారు. భగవద్రామానుజుల శ్రీచరణాలలో భక్తిని కలిగి ఉండాలనే ఆశను కలవారైతే ఏ కొరత ఉండదు.

**౩౨. (పొరున్దియ)**

**నిస్తులబోధం విపులాం కీర్తిం చ దివ్యమైశ్వర్యమ్,**

**ఔదార్యసంపదం చ శ్రీమద్యతిరాజచరణ యుగభక్తిః.**

భగవద్రామానుజుల చరణాలలో భక్తిని కలిగి ఉంటే సాటి లేని జ్ఞానం లోకంలో అంతటా వ్యాపించిన కీర్తి, నిండైన సంపద, ఔదార్యగుణం కలుగుతాయి.

**౩౩.(అడైయార్)**

**అనవరత మతులయశసో యతిరాజస్యైవ దివ్యసూక్తీనామ్,**

**గద్యత్రయాదికానామనుసంధానేన నయత భోః.**

ఆర్యులారా! గొప్ప కీర్తిని కల భగవద్రామానుజుల గద్యత్రయం మొదలైన దివ్యసూక్తులను అనుసంధిస్తూ కాలక్షేపం చేయండి.

**34.(నిలత్తై)**

**నిత్యగ్రంథే యతిపతిరచితే కథితం యథావదాచరితుమ్,**

**శక్తిదరిద్రాణామపి తచ్చింతనమాత్ర మాత్మనాం యోగ్యమ్.**

భగవద్రామానుజులు నిత్యగ్రంథంలో చెప్పిన రీతిలో ఆచరించడానికి సాధ్యం కాకపోయినా, దానిని అనుసంధించినా చాలు.

**35.(నయవేన్)**

**నయత సకలం చ కాలం యతిపతిచింతనయైవ భోః మర్త్యాః,**

**ఏషా చింతా భవతాం శ్రేయస్సందోహమూలమితి సత్యమ్.**

మానవజన్మను పొందిన భాగ్యశాలులారా! భగవద్రామానుజుల శుభగుణాలను సదా చింతన చేస్తూ కాలం గడపండి. ఇందువల్ల మీకు మంచి కలుగుతుంది.

**36.(అడల్ కొణ్డ)**

**అభిమాన ఏవ భవతో యతిరాజాస్మాక మక్షతం శరణమ్,**

**శ్రీవచనభూషణస్థ స్సిద్ధాంతో హ్యేష సర్వశాస్త్రార్థః.**

"స్వాభిమానత్తాలే ఈశ్వరాభిమానత్తై కులైత్తుక్కొణ్డ ఇవనుక్కు ఆచార్యాభిమానమొழிయ వేఱు గతియిల్లై" – (తన దురభిమానంతో భగవానుని అభిమానాన్ని పోగొట్టుకొన్న జీవునకు ఆచార్యుని అభిమానం తప్ప వేరు గతి లేదు – అని శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలో పలికినది సర్వశాస్త్రార్థసారం కనుక, భగవద్రామానుజా! నాకు మీ అభిమానం తప్ప వేరొక గతి లేదు.

**37.(పడికొణ్డ)**

**పటిమా జగతి బహూనాం కవితాయామస్తి కిం ఫలం తేన,**

**యే ఖలు యతిపతికవనే ప్రవణా స్తేషాం హి వాచి సాఫల్యమ్.**

కవిత్వాన్ని రచించడంలో లోకంలో ఎంతోమందికి సామర్థ్యం ఉన్నది. అయితే, దానివల్ల ఏమి ప్రయోజనం? భగవద్రామానుజులను స్తుతించడంలో ఎవరికి ఆసక్తి ఉన్నదో, వారి మాటే సార్థకమైనది.

**౩౮.(ఆక్కియడిమ్మై)**

**ఆహుః పూర్వే పురుషా స్సర్వేప్యర్థాన్ ప్రయాస మనుభావ్య,**

**యతిపతిరేకో గురురాట్ కేవలకృపయైవ బోధయామాస.**

భగద్రామానుజులకు ముందున్న ఆచార్యులు శిష్యులకు శ్రమ కలిగించి, అర్థాలను ఉపదేశించారు. కాని, భగవద్రామానుజులు కృపామాత్రప్రసన్నాచార్యులై దయతో ఉపదేశించారు.

**౩౯.(పారుళుమ్)**

**పోతం జలనిధితరణే సాపాయం సాధనం వదంతి భువి,**

**సంసృతిజలనిధితరణే నిరపాయం సాధనం యతీంద్రాంఘ్రిః.**

సముద్రాన్ని దాటడానికి నావ సాధనమైనా, అది ఎన్నో అపాయాలను కలిగినది — అని అంటారు. జన్మసముద్రాన్ని దాటడానికి భగవద్రామానుజుల శ్రీచరణాలే ఏ అపాయం లేని శరణం.

**౪౦.(శేమనల్)**

**క్షేమ స్స ఏవ హీతి శ్రీమద్యతిరాజవింశతిప్రోక్తమ్,**

**సూక్తిం చింతయతాం నః క్షేమస్యాముష్మికస్య కా హానిః.**

మణవాళ మహామునులు యతిరాజవింశతిలో **"క్షేమ స్స ఏవ హి యతీంద్ర! భవచ్ఛ్రితానామ్"** అని చెప్పబడిన విషయాన్ని చింతించేవారికి ఉభయవిభూతులలోను క్షేమానికి ఏ లోటు లేదు.

**41.(మణ్ మిశై)**

**మహ్యామిహ హరిరసకృజ్జాతోపి ఫలం న కించిదుపలేభే,**

**ఉదితే యతీంద్రభానౌ అభవన్ సర్వేపి భగవతి ప్రవణాః.**

భగవంతుడు ఈ లోకంలో మాటిమాటికి అవతరించినా ఏ ఫలం దక్కలేదు. భగవద్రామానుజులనే సూర్యులుదయించగానే అందరు భగవానునిపట్ల భక్తిని కలవారయ్యారు.

**42.(ఆయిణాళ్)**

**ఆదౌ శేషః ప్రథితః పశ్చాత్ సౌమిత్రిరథ హలీ జాతః,**

**అథ చ భగవాన్ యతీంద్రః ప్రాదురభూత్ సర్వజనరిరక్షిషయా.**

మునుముందు ఆదిశేషులవతరించారు. తరువాత లక్ష్మణులు, తరువాత బలరాములు, ఆ తరువాత సకలజనసముద్ధరణ కోసం భగవద్రామానుజులు అవతరించారు.

**43.(శురక్కుమ్)**

**శుష్యతు సంసృతిసాగర ఇతి మన్వానేన భగవతా ప్రహితః,**

**భోగిపతిరావిరాసీత్ రామానుజదివ్యమూర్తిమవలంబ్య.**

జన్మసాగరం ఎండిపోనీ! – అని భావించిన భగవానునిచే పంపబడిన ఆదిశేషులు భగవద్రామానుజ రూపాన్ని ధరించి, అవతరించారు.

**44.(శొల్లార్)**

**శుద్ధే యతిపతిదృష్టే సమయే లబ్ధోదయా మహాత్మానః,**

**యే కేపి వా భవంతు శ్రేయ స్తత్పాదసేవనం ప్రాహుః.**

పరమపవిత్రమైన భగవద్రామానుజదర్శనంలో జన్మించగలిగినవారు ఎవరైనా కానీ, వారి శ్రీచరణసేవ హితాన్ని కలిగిస్తుందని పెద్దలంటారు.

**45.(పేరొన్ఱు)**

**భేషజమతులం భవినాం భగవద్రామానుజార్యభక్తానామ్,**

**పాదపయోరుహపాంసుః సత్యమిదం మే వచోనుభవసిద్ధమ్.**

సంసారులకు భగవద్రామానుజుల శిష్యులైన శ్రీవైష్ణవుల పాదధూళియే సాటి లేని మందు. ఈ మాట నాకు అనుభవసిద్ధం.

**46.(కూఱు)**

**కూరేశగురువరో భువి యతిరాజ! భవత్ పదాశ్రితో న స్యాత్,**

**సత్యం శ్రీభాష్యస్యావతారవార్తైవ నో భవేజ్జగతి.**

భగవద్రామానుజా! కూరేశులు దేవరవారి శిష్యులుగా కాకపోయి ఉంటే లోకంలో శ్రీభాష్యం అవతరించి ఉండేదికాదు.

**47.(ఇళైజ్ఞ)**

**ఇందురివ భాతి చంద్రో గగనం వ్యోమేవ చేతి కథనమివ,**

**యతిరాడ్యతిరాజ ఇవేత్యభిధాతుం యోగ్యమితరథా నైవ.**

చంద్రుడు చంద్రునివలె వెలుగుతున్నాడు. ఆకాశం ఆకాశంవలె ఉన్నది — అని అన్నట్లే యతిరాజులు యతిరాజులవంటివారేనని అనాలి తప్ప ఇంకొకరు ఎవరితోను పోలినవారని పలుకడం తగదు.

**48.(నికరిన్ఱ)**

**నిధినివహానాం లాభే హృష్యతి జనా యథా హి భువనేస్మిన్,**

**తద్వద్యతివరసూక్తీః ప్రాప్యాహం హర్షమనుభవామ్యమితమ్.**

లోకంలోనివారు నవనిధులను పొందినపుడు ఏవిధంగా ఆనందిస్తారో, ఆవిధంగా భగవద్రామానుజుల, నవనిధులవంటి సూక్తులను పొంది ఆనందిస్తున్నాను.

**49.(ఆనదు శెప్పై)**

**ఆచక్షతే మహాంతో యతిపతిమవనౌ కృతావతారమముమ్,**

**శేషం సేనానాథం సాక్షాద్భగవంతమపి తత్త్వజ్ఞాః.**

ఈ భూలోకంలో అవతరించిన భగవద్రామానుజులే ఆదిశేషులని కొందరు, విష్వక్సేనులని కొందరు, సాక్షాద్భగవదవతారమే అని మరి కొందరు అంటారు.

**50.(ఉదిప్పన)**

**ఉద్యద్భానుసహస్రప్రతిమముఖాబ్జం యతీశ్వరం సాక్షాత్,**

**సంసేవ్య హర్షవివశాః వైకుంఠాప్తౌ చ నిస్స్పృహా జాతాః.**

వేయిమంది సూర్యులు ఒక్కసారి ఉదయించినట్లుగా ఉండే ముఖాన్ని కలవారైన భగవద్రామానుజులను నేరుగా సేవించి, ఆనందించేవారు వైకుంఠానికి వెళ్ళాలని కూడా కోరుకోరు.

**51.(అడియై త్తొడర్)**

**అతులం గీతాభాష్యం సతతం సంసేవ్య మోదమానానామ్,**

**తాత్పర్యచంద్రికోక్తిప్రకారా స్సంవర్ధయంతి సమోదమ్.**

సాటిలేని భగవద్రామానుజుల గీతాభాష్యాన్ని నిత్యం సేవించి ఆనందించేవారికి తాత్పర్యచంద్రికాశ్రీసూక్తులు వారి ఆనందాన్ని అతిశయింపజేస్తున్నాయి.

**52.(పార్థాన్ అఱు)**

**పారావారసమానాన్ భగవద్యతిరాజగుణగణాన్ వక్తుమ్,**

**సత్యం భోగిపతేరపి శక్తిర్నైవేతి సశపథం వచ్మి.**

భగవద్రామానుజుల సముద్రంవంటి కల్యాణగుణాలను తెలుపడానికి ఆదిశేషునకు కూడా శక్తి లేదు — అని ప్రమాణపూర్వకంగా పలుకగలను.

**53.(అఱ్బు దన్)**

**అద్భుతమద్భుతమద్భుత మేతద్యతిరజ! వింధ్యవిపినాత్త్వమ్,**
**నిశ్యేకస్యాం సహసా సత్యవ్రతమాగతో వినాయాసమ్.**

భగవద్రామానుజా! మీరు ఒక్క రాత్రిలోనే వింధ్యారణ్యంనుండి ఏ శ్రమ లేకుండా సత్యవ్రతక్షేత్రానికి రావడం చాలా ఆశ్చర్యకరమైన విషయం.

**54.(నాట్టియ)**

**నాట్యే గానేన్యత్ర చ యతీంద్ర! భవతః స్తుతీః ప్రయుంజానాః,**
**త్వయి భక్తిసంపదం హి ప్రజనయ్య భవంతి ధన్యజన్మానః.**

భగవద్రామానుజా! నాట్యంలోను, సంగీతంలోను, ఇంకొక విషయంలోను మీ విషయంగా కీర్తనలను ప్రయోగించేవారు మీ విషయంలో భక్తిరూపాపన్నమైన గొప్ప ప్రేమను కలిగించేవారవుతున్నారు.

**55.(కణ్డవర్)**

**కంఠే కఫాదిరుద్ధే సత్యపి భగవన్! సత్యపి యతీంద్ర! తవ దివ్యమ్,**
**పాదాంబుజం పవిత్రం స్తోతుం శక్తిం ప్రదేహి కృపయా మే.**

భగవద్రామానుజా! అంతిమసమయంలో కంఠాన్ని కఫం మొదలైనవి అడ్డుకొన్నా దేవరవారి దివ్యపాదారవిందాలను స్తుతించే భక్తిని నాకు మీరు ప్రసాదించాలి.

**56.(కోక్కుల మన్నరై)**

**గోకులరామస్యానుజమపి రామానుజ ముశంతి భువి సంతః,**
**వసతి స గోపీహృదయే న తు యతిపతివద్విపశ్చితాం హృదయే.**

రామానుజులనే పేరుకు రేపల్లెలో పెరిగిన బలరామానుజులనే అర్థాన్ని తెలుపుతారు. అయితే, ఆ రామానుజులు గోపికల హృదయాలలో ఉన్నాడు తప్ప, భగవద్రామానుజులవలె విద్వాంసుల హృదయాలలో లేదు.

**౫౭.(మట్రోరు)**

**మహ్యం వితరతు యతిరాట్ స్వీయపదాంభోజభక్తిభూమానమ్,**

**భక్తి స్సైవ తు సకలాం సంపదమతులాం ప్రదాస్యతు క్షిప్రమ్.**

భగవద్రామానుజులు నాకు తమ పాదాలవిందాలలో భక్తిని అనుగ్రహించాలి. అది కలిగితే అన్ని విధాలైన సంపదలు త్వరగా సిద్ధిస్తాయి కదా!

**౫౮.(పేదైయర్)**

**భేదం నైవ హి పశ్యంత్యార్యాః రామానుజార్యగురువర్యాత్,**

**కాంతోపయంతృయోగిని అధ్యవసాయోయ మనఘతత్త్వవిదామ్.**

భగవద్రామానుజులు, శ్రీమణవాళమహామునులు భిన్నులని భావింపబడడంలేదు. ఏదోషం లేని తత్త్వజ్ఞానాన్ని కలవారి నిశ్చయం ఇదే.

**౫౯.(కడలళవాయ్)**

**కలిసామ్రాజ్యోద్భూతం ధ్వాంతం నిరసితుమిహోదితో న యది,**

**భగవాన్ యతిపతిరహహ! క్షోణీ సర్వాపి తామసీ హి స్యాత్.**

కలివల్ల ఏర్పడిన అజ్ఞానాన్ని భగవద్రామానుజులు అవతరించి ఉండకపోతే, లోకమంతా చీకటితో నిండి ఉండేది.

**౬౦.(ఉణర్ న్ద మెయ్)**

**ఉర్వారుకమివ బంధాన్మృత్యోర్ముచ్యేయ తూర్ణమితి,**

**ఇచ్ఛంతి తే భవంతు శ్రీమద్యతిరాజసేవయా కృతినః**

"**ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ**" (దోసకాయ తొడిమనుండి విడివడేటట్లే, సంసారాన్ని విడచి, బయటకు వచ్చేస్తాను) అని వేదం తెలిపినట్లే, సంసారాన్ని విడచి, త్వరగా బయటపడాలని కోరుకొనేవారు భగవద్రామానుజులను సేవించి, కృతార్థులు అవుతారు)

**61.(కొ(ఘ్రన్దువిట్టు)**

**కో వా గురురిహ భువనే దిక్షు విదిక్షు చ నిజం యశో విమలమ్,**

**ప్రసృమర మతతనోద్భగవద్భాష్యకృదన్యః పవిత్రతమజన్మా.**

భగవద్రామానుజులు తప్ప ఇంకొక ఏ ఆచార్యులు లోకంలో అంతటా నిండిన కీర్తిని కలవారై వెలుగుతున్నారు?

**62.(ఇరున్దేన్)**

**ఇంధే యతీంద్ర భవతశ్చరణద్వంద్వం సదైవ మమ హృదయే,**

**అత ఏవాంతఃకరణం మామకమాభాతి సంహతధ్వాంతమ్.**

భగవద్రామానుజా! దేవరవారి శ్రీచరణాలు సదా నా హృదయం లోపల ప్రకాశిస్తున్నాయి. అందువల్లనే నా హృదయం చీకటి లేనిదై వెలుగుతున్నది.

**63.(పిడియ్యై తొడరుమ్)**

**పిబత యతీంద్రప్రవణప్రవణానాం దివ్యపాదసత్తీర్థమ్,**

**యేన హి సకలాన్యేనాంస్యవిలంబితమేవ నాశ ముపయాంతి.**

సకలపాపాలు క్షణంలోనే పోగొట్టగలిగినదైన యతీంద్రుల భక్తుల శ్రీపాదతీర్థాన్ని సేవించండి.

**64.(పణ్డరు మాఱన్)**

**పండితపామరభేదం వినైవ సర్వేపి యతిపతేక కృపయా,**

**పూర్వమివ సాంప్రతం చ ప్రయాసలేశం వినా సముత్తీర్ణాః.**

పండితులు, పామరులు – అనే తేడా లేకుండా అందరు భగవద్రామానుజుల అనుగ్రహంతో పూర్వకాలంలోవలె ఈకాలంలో కూడా సులభంగా తరిస్తున్నారు.

**౬౫.(வாழ் வற்றது)**

**వాక్పతిరేష హి సాక్షాత్ భువీతి వక్తవ్యతాం ప్రపన్నాశ్చ,**

**సత్యం యతిపతిమార్య! స్తుత్వైవ భవంతి ధన్యజన్మానః.**

**"వీరు భూలోకబృహస్పతి"** అని పొగడదగినవారు కూడా భగవద్రామానుజులను స్తుతించే వారి జన్మసార్థక్యాన్ని పొందుతున్నారు.

**౬౬.(ஞானம் கனிந்த)**

**జ్ఞానం భగవద్విషయక ముపేతు మా వా ధరాతలే మర్త్యాః,**

**యతిపతితత్ప్రవణోక్తిజ్ఞానం ఖలు సర్వసంపదాం మూలమ్.**

భూలోకంలో నివసించే మానవులారా! మీకు భగవానునిగూర్చిన జ్ఞానం ఉన్నా, లేకపోయినా, ఏవిచారం లేదు. భగవద్రామానుజుల, వారిపట్ల ప్రావణ్యాన్ని కల మణవాళ మహామునుల శ్రీసూక్తులలో జ్ఞానం కలిగి ఉండడమేకదా!, అన్ని సంపదలకు మూలం.

**౬౭.(சரணமடைந்த)**

**శరణం యతీంద్ర భవతః చరణద్వంద్వం హి సర్వ ఆచార్యాః,**

**ప్రాహు రనుకల్ప ఏషః తత్ప్రవణాంఘ్రిర్హి ముఖ్యకల్పో నః.**

ప్రతి విషయంలోనూ ముఖ్యకల్పమని (గౌణకల్పం), అనుకల్పమని రెండు ఉంటాయి కదా. భగవద్రామానుజుల శ్రీచరణాలను భజించడం మాకు గౌణకల్పం. వారి భక్తుల పాదాలను సేవించడం ముఖ్యకల్పం.

**౬౮.(ఆరెనక్కిన్ఱు)**

**ఆచార్యసార్వభౌమ! శ్రీమాన్ వరయోగిమూర్తిమిహ నో చేత్,**

**స్వీకృతవానభవిష్యత్ ధ్రువమైధిష్యత పునః కలిధ్వాంతమ్.**

ఆచార్యసార్వభౌములైన భగవద్రామానుజా! మీరు మళ్ళీ మణవాళమహామునుల రూపాన్ని ధరించి అవతరించి ఉండకపోతే తిరిగి కలివల్ల కలిగే అజ్ఞానం వృద్ధిచెంది ఉండేది – అనేది నిశ్చయం.

**౬౯.(శిన్దైయినోడు)**

**చింతయత నిత్యమర్థా నతిమధురాన్ లక్ష్మణార్యకృతిబృందే,**

**యే ఖలు లుంపతితమాం తమాంసి చిత్తే విసృత్వరాణ్యాశు.**

మానవులారా! మీ మనసులో వ్యాపించి ఉండే అజ్ఞానాంధకారాలను పోగొట్టగలిగినవి, చాలా మధురమైనవి అయిన భగవద్రామానుజుల దివ్యగ్రంథాలలోని అర్థాలను నిత్యం అనుసంధించండి.

**౭౦.(ఎన్నైయుమ్ పార్ త్తు)**

**ఏత దవధేయమార్యైః శ్రీభాష్యే స్పష్టబోధరహితా యే,**

**అర్థాస్తేషాం గద్యత్రయత ఉపజీవనం యతీంద్రేష్టమ్.**

శ్రీభాష్యంలో స్పష్టంగా లభించని అర్థాలను గద్యత్రయంలో నుండి గ్రహించి తెలియాలనేది భగవద్రామానుజుల అభిప్రాయం. (ఈ అర్థాలు – నారాయణశబదవాచ్యత్వ, లక్ష్మీపతిత్వాదులు)

**౭౧.(శార్ ఙ్గదెన్ శిన్దై)**

**శార్ ఙ్గీ తిష్ఠతు కామం పురతో మమ తం విహాయ యతిరాజమ్,**

**సేవేయేత్యమృతకవిః ప్రాహ తదుక్తిం సుశోభనాం మన్యే.**

**"తిరువరంగర్ కైత్తలత్తాழியుమ் శఙ్గుముమేన్దు నమ్ కణ్ ముకప్పే....ఉన్నై విడేన్ ఎన్ఱిరుక్కిలుమ్ నిన్ పుకళే మొయ్ త్తలైక్కుమ్ వన్దు"** (శ్రీరంగనాథుదు చేతులలో శంఖ, చక్రాలను ధరించి మన ముందుకు వచ్చి 'నిన్ను విడువను' అని పలికినా, రామానుజా! నీ కళ్యాణగుణాలే నీ కళ్యాణగుణాలే నాకు నిండుగ సాక్షాత్కరిస్తాయి) అని అముదనార్ పలికిన సూక్తి రమణీయం.

**72.(కైత్తనన్)**

**కైటభకంసముఖానాం దైత్యానాం విదళనే పరం దక్షః,**

**భగవాన్, యతిపతిరార్యో దురర్థవాదిక్షయం హి భువి కృతవాన్.**

మధుకైటభాది అసురులను వధించడంలో మాత్రమే భగవానుడు సమర్థుడు. కానీ భగవద్రామానుజులు విపరీతార్థాలను పలికేవారిని కూడా నిరసించారు.

**73.(వణ్ మైయినాలుమ్)**

**వంధ్యాతనయఖపుష్పప్రవాదతుల్య వాదనిరతానామ్,**

**కుదృశాం ప్రలపితనిచయం యతిపతి రవలీలయైవ వారితవాన్.**

వంధ్యాసుతుడు, ఆకాశపుష్పంవంటి శూన్యవాదాలను చేసే కుదృష్టివాదుల వాదాలను భగవద్రామానుజులు అనాయాసంగా ఖండించారు.

**74.(తేరార్ మఱై)**

**తే ఖలు భువనే ధన్యాః భగవల్లక్ష్మణార్యముఖకమలమ్,**

**సాక్షాదవేక్ష్య హర్షప్రకర్షమాపుర్హి కూరనాథార్యాః.**

భగవద్రామానుజుల మఖకమలాన్ని నేరుగా దర్శించిన కూరేశులు మొదలైనవారు ఈలోకంలో ధన్యులు.

**75.(శెయ్ త్తలై)**

**శంఖసుదర్శనధారిణి శార్ జ్గిణి భగవతి సమక్షదృష్టేపి,**

**తస్మిన్ రుచిర్న మే స్యాత్ సత్యం యతిరాజవపుషి సక్తోహమ్.**

కంటికి గోచరించని భగవానుడు శంఖచక్రాలను ధరించి నాకెదురుగా నిలచినా, భగవద్రామానుజుల అందాన్నే నేను దర్శించాలని కోరుకొంటాను. ఇది నిజం.

**76.(నిన్ఱ వణ్)**

**నిపుణా బహవః కవయో వనితాచరితోపవర్ణనే సక్తాః,**

**భగవద్యతిపతినుతిషు ప్రవణాః కవయో హి ధన్యజన్మానః.**

శకుంతల, మాళవిక మొదలైన స్త్రీల చరిత్రలను వర్ణించగల కవులు అనేకులున్నారు. భగవద్రామానుజులను స్తుతించగలిగిన కవుల జన్మకదా!, ప్రశంసించదగినది.

**77.(ఈన్ఱనన్)**

**ఈషదపి నైవ మిథ్యా యతిపతిరేకో హి గురుపదార్హోత్ర,**

**అంధతమసం స ఏవ హి నిరాస్థదత్యంత మాత్మక కృతిరత్నైః.**

భగవద్రామానుజులొక్కరే ఆచార్యులనదగినవారు వారు. తమ దివ్యసూక్తులతో ఆంతరత–మస్సును పోగొట్టినవారు. ఇది అసత్యం కాదు.

**77.(కరుత్తిల్)**

**కరుణావరుణాలయ! భోః! యతీంద్ర! సర్వాంశ్చ గురువరాన్ భువనే,**

**కారుణికాన్ కథయామ స్తవ కరుణైకా హి నిస్తులా జగతి.**

దయాసముద్రులైన ఓ రామానుజా!, లోకంలో ఆచార్యులందరినీ కరుణను కలవారుగా పలుకుతున్నాను. కానీ నీ కరుణ లోకంలో సాటిలేనిది.

**౭౮.(పొయ్యెచ్చురక్కుమ్)**

**పునరపి పునరపి భవతో గుణగణకథనేషు యతిపతే! భగవన్!,**

**జిహ్వా మమోజ్జిహీతే లేఖితు మేతాన్ సముత్సుకో పాణిః.**

భగవద్రామానుజా! మాటిమాటికి తమ కల్యాణగుణాలను ప్రశంసించడంలోనే నా జిహ్వా ఆసక్తిని కలిగి ఉన్నది. వాటినిగూర్చి వ్రాయడంలోనే నా చేయి ఉత్సాహాన్ని పొందుతున్నది.

**౮౦.(నల్లార్)**

**నళినసమవక్త్ర లోచనకరచరణాదేః యతీంద్ర! తవ దివ్యమ్,**

**వపు రవలోకితవంతః సత్యం నాన్య త్ర, పాతయంతి దృశమ్.**

తామరపూవు వంటి ముఖం, నేత్రాలు, చేతులు, పాదాలు – మొదలైన దివ్యావయవాలను కల భగవద్రామానుజా! దేవరవారి రూపాన్ని సేవించగలిగినవారు ఇక వేరు ఏ వస్తువులోను కోరికను కలవారు కారు.

**౮1.(శోర్విన్ఱి)**

**శోధయితు మాత్మదేహం గంగాం యమునాం సరస్వతీం యాంతి,**

**యతిరాజ! తవ పదాంబుజతీర్థం సర్వాఘశోధకం సత్యమ్.**

భగవద్రామానుజా! లోకంలోనివారు తమను పవిత్రంగా చేసికోవడంకోసం గంగ, యమున, సరస్వతి మొదలైన నదులలో స్నానం చేస్తారు. కాని, దేవరవారి శ్రీపాదతీర్థమే సర్వాంగాలను పవిత్రం చేయగలిగినది. ఇది నిజం.

**౮౨(తెరివుற்ற)**

**తే ఖలు జగతి కృతార్థాః శ్రీభాష్యాదిషు భవన్నింధేషు,**

**కాలం క్షిపంతి యే వై హంతైతే దుర్లభా యతీశాన.**

భగవద్రామానుజా! దేవరవారు అనుగ్రహించిన శ్రీభాష్యం మొదలైన గ్రంథాలతో కాలక్షేపం చేసే మహనీయులు కృతార్థులు. అయితే, అటువంటి అధికారులు లోకంలో దుర్లభులు.

**౮౩.(శీర్ కొణ్డు)**

**శ్రీమద్యామునమునిరాట్ కాంచీమభ్యేత్య కరుణయా నిజయా,**

**వ్యైక్షత భవంత మారాత్ తత ఏవ భవాన్ సమృద్ధకీర్తిరభూత్.**

భగవద్రామానుజా! ఆళవందార్ తమ సహజమైన కరుణతో కాంచీపురానికి వేంచేసి, "ఆముదల్వనివన్" అని మిమ్ములను కటాక్షించారు. అందువల్లనే దేవరవారి కీర్తి వృద్ధిపొందింది.

**౮౪.(కణ్డు)**

**కథయత యతిపతికరుణాం ప్రణమత తత్పాదపంకజద్వంద్వమ్,**

**విలిఖత తదుక్తిరాశిం ప్రవిశత తస్యావతారభూతపురీమ్.**

మానవులారా! భగవద్రామానుజుల కరుణనుగూర్చి చెప్పండి. వారి పాదపద్మాల రెండిటికి నమస్కరించండి. వారి సూక్తులను లిఖించండి. వారు అవతరించిన శ్రీపెరుంబూదూరును దర్శించండి.

**౮౫.(ఓదియ)**

**ఓషధ్యధీశసన్నిభవదనం యతిరాజ! తావకం సతతమ్,**

**నక్తందివం మమాగ్రే విలసతి ధన్యోస్మి భాగ్యమిద మతులమ్.**

భగవద్రామానుజా! దేవరవారి చంద్రునితో పోలిన ముఖం రాత్రి-పగలు నిరంతరంగా నా కంటి ముందు వెలుగుతున్నది. నేను సాటి లేని ఈ భాగ్యాన్ని పొందినవాడనయ్యాను.

**౮౬.(పట్రా మనిశరై)**

**పశ్యంతి జగతి బహవో నిరర్థకంథాశతాని యతిరాజ!,**

**తావకముఖాబ్జనిర్గత దివ్యగ్రంథేషు సత్సు భోగ్యే.**

భగవద్రామానుజా! దేవరవారు పలికిన, పరమభోగ్యాలైన దివ్యగ్రంథాలున్నా, లోకంలో పలువురు వ్యర్థమైన గ్రంథాలను పరామర్శిస్తున్నారు.

**87.(పెరియవర్)**

**పేతు ర్బహవో నరకేష్వసేవ్యసేవాదుష్కృతై రహహ,**

**యతిపతిసేవాభాగ్యం నాల్పస్య ఫలం హి తపస ఇత్యాహుః.**

భగవద్రామానుజులను సేవించగలిగే భాగ్యం గొప్ప తపస్సు యొక్క ఫలమని పెద్దలంటారు. పలువురు సేవించదగనివారిని సేవించడం మొదలైన దుష్కర్మలతో నరకంలోకి పడిపోతున్నారే! అయ్యో!

**88.(కలిమిక్క)**

**కలియుగముఖే హి శఠజిన్మని రభిహితవాన్ కలిర్హతో భవితా,**

**ఇతి యతిరాజ! తదుక్తి స్సార్థా భవతోవతారతో జాతా.**

నమ్మాళ్వార్లు కలియుగం ఆరంభమయేటపుడు **"కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్ మిన్"**–కలి నశిస్తుంది, గమనించండి – అని అన్నారు. భగవద్రామానుజా! ఈ సూక్తి దేవరవారి అవతారంతో వాస్తవమైనది.

**89.(పోఱ్ఱరుమ్)**

**భోగేషు లౌకికేషు భ్రామ్యంతి జడాః జనాస్తు భోగిపతే!,**

**తావకభోగే భవ్యే ముగ్ధాః కూరేశదాశరథ్యాద్యాః.**

ఆదిశేషస్వరూపులైన భగవద్రామానుజా! పామరజనులు లోకంలో ఉండే అల్పానందాలలో భ్రమిస్తున్నారు. దేవరవారి తిరుమేనిసౌందర్యంలో అభినివేశాన్ని పొందే భాగ్యశాలురు ముదలియాండాన్, కూరేశులు మొదలైనవారే.

**90.(నినైయార్)**

**నిత్యం యతీంద్ర! తావకచరణాంభోజస్మృతిం వితన్వానాః,**

**ఇహ భువి నిత్యాన్ముక్తానతిశేరత ఇత్యనర్గళం వచనమ్.**

భగవద్రామానుజా! నిత్యం దేవరవారి శ్రీచరణయుగాన్ని ధ్యానించేవారు ఈ భూమిలో ఉండగానే నిత్యముక్తులకంటే గొప్పవారనేది వివాదరహితమైన మాట.

**91.(మరుళ్)**

**మధు మధుర మథ చ ఫాణిత మతిమధురమితి బ్రువంతి భువి మూర్ఖాః,**

**మాధుర్య మప్రమేయం న విదంతి యతీంద్ర! తావకోక్తితతౌ.**

భగవద్రామానుజా! ఈ లోకంలోని మూర్ఖులు దేవరవారి శ్రీసూక్తులలోని లెక్కకట్టలేని మాధుర్యాన్ని తెలియకుండా, మధువును, కలకండను మధురమని అంటున్నారు.

**92.(పుణ్ణియ)**

**పుణ్యజనబాధనార్థం భువ్యవతీర్ణో హి జానకీజానిః,**

**యతిరాజ! పుణ్యపురుషాః ఉదజీవన్ బహవ ఏవ తవ దయయా.**

భగవద్రామానుజా! **"యాతుధానః పుణ్యజనః"** అనే ‘అమర’నిఘంటు వచన ప్రకారం పుణ్యజనులనబడే రాక్షసులను వధించడంకోసం భగవానుడు శ్రీరాముడై అవతరించాడు. దేవరవారి కరవల్ల పుణ్యపురుషులదరు ఉజ్జీవించారు.

**93.(కట్ట)**

**కష్టం! హా ధిక్! కష్టం! ప్రలపంతి జడాః జగన్నిరీశానమ్,**

**వయమిహ సత్యం బ్రూమః యతిరాజేనైన నాథవాన్ లోకః.**

కొందరు మూర్ఖులు లోకానికి ఈశ్వరుడు లేడని ప్రలపిస్తున్నారు. నిజంగా మనం ఏమని పల్కుతున్నాము? అంటే, — "భగవద్రామానుజులే లోకానికంతటికీ ప్రభువు” — అని.

**94.(తవమ్ తరుమ్)**

**తపసా శరీరశోషణనిష్ణాతైః హంత! కిం ఫలం లబ్ధమ్?,**

**యతిపతికైంకర్యకృతే వయమిహ దేహస్య పోషణం కుర్మః.**

తపస్సు చేసి దేహాన్ని కృశింపజేసికొనే తాపసులు ఏమి ఫలాన్ని పొందారు? భగవద్రామానుజులకు కైంకర్యం చేసికోవడంకోసమే మనం మన శరీరాలను పోషించుకొంటున్నాము.

**95.(ఉణ్ణిన్ఱు)**

**ఉడుపం పరిగృహ్య తరంత్యుదధిం సంసారసాగరోత్తరణే,**

**యతిరాజనామకీర్తనమేకం ప్లవతా ముపైతి విశయమృతే.**

లోకంలో ఉప్పుసముద్రాన్ని దాటడానికి నావను సాధనంగా చేసికొంటున్నారు. మనం భగవద్రామానుజుల నామసంకీర్తనమనే నావ నిశ్చయంగా సంసారసాగరాన్ని దాటడానికి సాధనమవుతున్నది.

**96.(వళరుమ్)**

**వందే యతిపతిచరణౌ మందేతరమోదలబ్ధయే సతతమ్,**

**సందేహ ఇహ భవేత్కిం? సందోహో జాయతే హి మోదానామ్.**

అంతు లేని సంతోషాన్ని పొందడంకోసం భగవద్రామానుజుల శ్రీచరణాలను సదా నమస్కరిస్తున్నాను. ఈ విధంగా సేవించడంవల్ల సంతోషసందోహం కలగడంలో ఏమి సందేహమున్నది?

**97.(తన్నైయుమ్)**

**తపనో హరతి తమిస్రాం పునరపి సా జాయతే హి న చిరేణ,**

**యతిరాజతపననిహతం తమ అవిద్యం కదాపి నోదేతి.**

సూర్యుడు చీకటిని పోగొడుతున్నా, అది మళ్ళీ తిరిగి త్వరగా వచ్చి వ్యాపిస్తున్నది. భగవద్రామానుజులచే పోగొట్టబడిన అవిద్య అనే చీకటిమాత్రం ఇక ఏనాడూ తిరిగి వ్యాపించదు.

**98.(ఇడుమే)**

**ఇషుభిర్జఘాన రామో రక్షోనివహాన్ యతీంద్ర! ధనుషా చ,**
**కాలేయరాక్షసానాం నివహం తు భవాన్ స్వసూక్తిభి ర్హతవాన్.**

భగవద్రామానుజా! శ్రీరాముడు రాక్షససమూహాలను బాణసమూహంతో, ధనుస్సుతో వధించాడు. దేవరవారు కలియుగ రాక్షసులను మీ శ్రీసూక్తులతో నిరసించారు.

**99.(తర్ క్క)**

**తర్కోప్రతిష్ఠ ఇతి యత్ పారాశర్యో జగాద సత్యం తత్,**
**అనవద్యశాస్త్రబృందైః యతిపతిరఖిలార్థసాధనే దక్షః.**

కేవలం తర్కశాస్త్రం మాత్రం ప్రమాణం కాదని వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాలలో పలుకడం ప్రసిద్ధం. దీనిని పలు శ్రుతులతో స్థాపించడంలో సమర్థులు భగవద్రామానుజులు ఒక్కరే.

**100.(పోన్దదు)**

**భోజన మథ చ స్వాపో విషయాణాం భోగ ఇత్యదఃకృత్యైః,**
**కాలం క్షిపంతి కితవాః హంత! యతీంద్రోక్తిబృందసత్త్వేపి.**

మన భగవద్రామానుజుల అమృతంవంటి చసూక్తులు అనేకం ఉన్నా, ఈ తమోమయమైన లోకంలో మూఢులు భుజించడం, నిద్రపోవడం, లౌకికవిషయాలను అనుభవించడం మొదలైన కార్యాలతోనే వ్యర్థంగా కాలం గడపుతున్నారు.

**101.(మయక్కుమ్)**

**మయి మతివిరహితజంతౌ యతిపతిరహహా! స్వకీయయా కృపయా,**

**స్వీయప్రభావబోధం జనయామాసేతి నైవ చిత్రమిదమ్.**

సాటి లేని నా నైచ్యాన్ని చూడకుండా నన్నుకూడా కేవలం తమ కృపతో భగవద్రామానుజులు అనుగ్రహించారు. కృపామాత్రప్రసన్నాచార్యులైన వారి విషయంలో ఇది ఆశ్చర్యం ఏమీ కాదు.

**102.(నైయుమ్)**

**నైవాస్తి జగతి జేతుం మామిహ కోపీతి సశపథం వచ్మి,**
**యదహం యతీంద్రచరణే తత్ప్రవణాంఘ్రౌ చ దృఢతరం ప్రవణః.**

భగవద్రామానుజులను, వారిని ఆశ్రయించిన యతీంద్రప్రవణులైన మణవాళ మహామునులను ఆశ్రయించిన నాకు ఈ విశాలభూమిలో ఎవరు సాటి? – అని ప్రమాణపూర్వకంగా పలుకుతున్నాను.

**103.(వళర్ న్ద)**

**వస్తుత ఇదం బ్రవీమి శ్రీమద్యతిరాజ ఏవ వరయోగీ,**
**భూత్వా ప్రపనన్నగోష్ఠీం సనాథయామాస భాగ్యభూమ్నా నః.**

భగవద్రామానుజులే మణవాళ మహామునులుగా అవతరించి, ప్రపన్నగోష్ఠిని పావనం చేయడం అనేది దాసులమైన మన భాగ్యం.

**104.(కైయిల్)**

**కైతవ మనృతోక్తిం వా పరిహాసం వాపి విప్రలిప్సాం వా,**
**న మనాగపి జానీతో యతివరవరవరమునీ ఉభావేవ.**

వంచన, అసత్యం పరిహాసం, విప్రలిప్స — అనే వీనిని కొంచెంకూడా లేనివారు భగవద్రామానుజులు, వారి అపరావతారమైన వరవరమునులు.

**105.(శెచ్ఱ్రుప్పెడిరై)**

**శేషత్వపారతంత్ర్యే లక్షణమాత్మన ఇతీదృశం జ్ఞానమ్,**
**యతిపతివరవరయోగిశ్రీసూక్తిభిరేవ జాయతే జగతి.**

భగవచ్ఛేషత్వం, పారతంత్ర్యం (ఆత్మస్వరూపమనే జ్ఞానం) భగవద్రామానుజుల, శ్రీమణవాళ మహామునుల శ్రీసూక్తుల వల్లనే కలుగుతుంది.

**106.(ఇరుప్పిడమ్)**

**ఇద మవలేపవచో మే శ్రుణుత యతీంద్రాచ్చ సోహ ముత్తంగః,**
**పంచకసప్తతివింశతిచింతాభాగ్యం యతో న తస్యాస్తి.**

భగవద్రామానుజులకు కూడా లేని అతిశయం దాసునకున్నది. అది ఏమంటే – భగవద్రామానుజుల విషయంలోని ధాటీపంచకం, యతిరాజసప్తతి, యతిరాజవింశతి – అనే ఈ స్తుతులను అనుదినం సేవించే భాగ్యం నాకున్నదిగాని, భగవద్రామానుజులకు లేదుకదా!

**107.(ఇఙ్గు ఱ్ఱు)**

**ఇహ బహవో గురువర్యాః ప్రాదురభూవన్ తథాపి యతిరాజః,**
**గురురద్వితీయ ఆసీత్ ధ్వాంతం యేనాఖిలం చ విధ్వస్తమ్.**

అజ్ఞానావృతమైన ఈ జగత్తులోని అజ్ఞానాన్ని అంతటినీ పోగొట్టినందున, భగవద్రామానుజులొక్కరే ఆచార్యులందరికంటే గొప్పవారు.

**108.(అఙ్గయల్)**

**అణ్ణంగరార్యదాసః పరయా భక్త్యా యతీంద్రనుతి మేనామ్,**
**విజ్ఞాప్య హర్షమతులం భేజే సేయం చకాస్తు భక్తహృది.**

కాంచీపురవాసిని అయిన ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యదాసుడనే నేను ఈ యతిరాజస్తుతిని రచించి, చాలా ఆనందాన్ని పొందాను. భక్తుల హృదయాలలో ఇది సదా ప్రకాశించుగాక.